విడిప్రతిక ౧అణా

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H E H The Nizam's Dominions
HYDERABAD - Deccan

103212

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును.

సం॥ చందా ౬ రూ. | Thursday 22—8—1935 | అర్ధ సం॥ చందా ౩ రూ.

సంపుటము ౧౦. | త్రూపుబజారు, హైదరాబాదు - దక్కన్. | Vol. 10
సంచిక ౩౦. | శాలి ౧౮౫౭ శ్రీ యువ సం॥ శ్రావణబ. ౯ గురువారము ౧౫ మెహర్ ౧౩౪౪ ఫ. | No. 30.

# చతుర్థ నిజాంరాష్ట్రాంధ్ర మహాసభకు ఆహ్వానము

## కరీంనగరముజిల్లా ప్రముఖుల ప్రయత్నములు

### కేంద్రసంఘముతో ఉత్తరప్రత్యుత్తరములు

(స్వకీయ విలేఖరి)

సిరిసిల్ల; ౧౦-౧౧-౪౪ఫ:—

వారము దినముల నుండి చతుర్థాంధ్ర మహాసభను సిరిసిల్లకు ఆహ్వానించు విషయమై తీవ్రముగా నాలోచనలు జరుగు చుండెను. ఆంధ్రోద్యమము నెడ గాఢాభిమానము గలవారిని ౯-౧౧-౪౪ఫ. తేదిని సిరిసిల్లలో సమావేశపరచుటకు నిశ్చయింపబడియుండెను. తదనుసారము నిన్న సాయంకాలము ౫ గంటల సమయమున ఆంధ్రాభిమానులు సమావేశమైరి. సమావేశములో పాల్గొనిన వారందరును మిగుల సభిమానముతోను, శ్రద్ధతోను విచారించి నిజాం రాష్ట్రాంధ్ర చతుర్థాంధ్ర మహాసభను సిరిసిల్లకు ఆహ్వానించుటకై నిశ్చయించిరి. ఈ సమావేశములో నీక్రిందివారు పాల్గొనిరి. శ్రీయుతులు కోడిమేల భూమయ్య వకీలుగారు, లక్ష్మణ్ రావు వకీలు గారు, జె రామరావు వకీలుగారు, ఆర్. అనంతరావు వకీలుగారు వేణుగోపాల్ రావు వకీలుగారు, కొండల్ రావు వకీలు గారు, ఆచి నృసింహాచార్యులుగారు, డాక్టర్ భూపతిగారు, బి. ఎల్లారెడ్డిగారు, వెంకటేశంగారు. ఇంక కొందరుగూడ పాల్గొనిరి.

దీర్ఘముగా నాలోచించిన పిమ్మట ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా నామోదింపబడెను:—

(౧) ఈ సంవత్సరము జరుపబడనున్న నిజాంరాష్ట్ర చతుర్థాంధ్ర మహాసభను సిరిసిల్లకు ఆహ్వానించుటకు తీర్మానించుచున్నాము.

(౨) ఆహ్వాన సంఘ స్థాపనకై తీర్మానము నేర్పాటును గావించుటకును ఆహ్వాన సంఘ స్థాపన మగువంతవరకు కేంద్ర సంఘముతో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును ఈదిగువ సభ్యులుగల సంఘము నేర్పాటు చేయుచున్నాము

(౧) శ్రీయుత కోడిమేల భూమయ్య వకీలు గారు, సిరిసిల్ల; అధ్యక్షులు.

(౨) శ్రీయుత జె రామరావు గారు, వకీలు సిరిసిల్ల

(౩) శ్రీయుత వేణుగోపాల్ రావు గారు వకీలు

(౪) శ్రీయుత ఆర్ అనంత రావు గారు వకీలు, సిరిసిల్ల

(౫) శ్రీయుత బి. ఎల్లారెడ్డిగారు, గాలిపల్లి.

పై తీర్మానముల నాధారము జేసుకొని పై సంఘము అప్పుడే కార్యాచరణకు గడంగినది. ఈ విషయమును గూర్చి కేంద్రసంఘమునకు వ్రాయబడినది. కేంద్ర సంఘమునుండి యంగీకారము వచ్చిన వెంటనే ఆహ్వానసంఘ స్థాపనకై ప్రయత్నములు జరుపబడునని తెలియుచున్నది.

నిన్నటి దినము సమావేశమైన మహాశయులు కనపఱచిన యుత్సాహాభిమానములు వర్ణనాతీతముగా నుండెను. వీరేకాక యీతాలూకాలో నింక కొందరు అభిమానులు గలరు. వారు గ్రామములలో దూరమున నుండువారు గాన వారిని విచారించుటకు వీలుగలుగ లేదని తెలియుచున్నది ఐనను ఈసదుద్యమమునకు వారు సర్వ విధముల తోడ్పడ గలరని యాశింపబడుచున్నది.

---

## సంపూర్ణ స్వాతంత్ర్యముకలవారెవరైనా గలరా?

### జవాబు మీభార్యలకిందు, నాకు వ్రాయవలసి

### స్వాతంత్ర్య తత్వమునుగూర్చి జార్జి బెర్నార్డ్‌షాగారి రేడియో ప్రబోధము

సోదరీ సోదరులారా! నేడురాత్రి నేను స్వాతంత్ర్యమునుగూర్చి మాటలాడుటలో మామూలు ప్రాతిపదికనంతను మరల యేకరువు పెట్టుటకు నాకు తీరుబడి లేదు.

సంపూర్ణ స్వాతంత్ర్యము గల మనుష్యుడనగా నేమియర్థము! తనకిష్టమైన పనిని ఎప్పుడైనను, యేస్థలమునందైనను చేయుటయును, యిష్టములేనిచో చేయకుండుటయును స్వేచ్ఛగలవాడే. అట్టి మనుష్యుడొక్కడును యీ కాలములో లేడు. ఏకాలమందునుగూడ నుండడు.

మనకిష్టమున్నను లేకపోయినను మన జీవితకాలములో మూడవవంతు కాలమును నిద్రలో గడపక తప్పదు. స్నానము చేయుట, మాసిన బట్టలను విప్పుట? తాజా బట్టలను కట్టుట యీ పనులకు రెండుగంటలు పట్టును. తినుటయును త్రాగుటయును మరిరెండు గంటలుపట్టును. ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు పోవుటకు గూడ రెండుగంటలు పట్టును. ఈరీతిగా ఆరు గంటలు నిత్యకృత్యములక్రింద ప్రతి దినమును వ్యయమగుచుండును. వేలకొలది నౌకరులుగల గొప్పరాజైనను, భార్యతప్ప మరెట్టి నవుకరులును లేని కూలివాడైననుగూడ యీ నిత్యకృత్యముల నతిక్రమింపజాలడు. మనమందరము వీటికి దాసులమే. స్త్రీలకు బిడ్డలను కనుటయు, మరియొక దుర్భరతరమునగు దాస్యము గూడ నున్నది. స్త్రీలు బిడ్డలను కననిచో ప్రపంచమున మనుష్యులుండరు.

ఇవిసహజములును అనుల్లంఘనీయములునైన నిత్యకృత్యము లగుటచే వీటిని మనము మాన వీలులేదు. వీటినిమిత్తము మరికొన్ని పనులుగూడ మనము మాన వీలులేదు. వీటినిమిత్తము మరికొన్ని పనులుగూడ మనము చేయవలసి వచ్చుచున్నది మనము తిండితినవలెను గాన ఆహార పదార్థములను సమకూర్చుకొనవలెను మనము నిద్రించవలెను గాన మనకు యిండ్లు, గదులు, కుంపటులు, వాటిలోనికి బొగ్గు, మంచములు, పరుపులు యివన్నియును కావలెను. మనము వీధులవెంట నడువవలెను గాన దిగంబరులముగా నుండగూడదు. అందులకు మనకు బట్టలుకావలెను. ఆహార పదార్థములను మనుష్యులే నిర్మించగలరు. అటుల కొందరునిర్మించినచో మరికొందరు దొంగిలించెదరు. కొన్ని టికలు కష్టపడి తేనెను తయారు చేయును. మనుష్యులు దానిని దొంగిలించెదరు. మనము ఒకస్థలమునుండి మరియొక స్థలమునకు పోవుటకు వలన నడచి వెళ్లజాలకపోయినచో మనము గుఱ్ఱములను మనకు బానిసలనుగా చేసికొనెదము. మనము తేనెటీగ తేనెను, గుఱ్ఱము యొక్క స్వాతంత్ర్యమును దొంగిలించుటయేకాక మనుష్యులలో స్త్రీలు, పురుషులు, పిల్లలు మొదలైనవారి సొత్తులను గూడ దొంగిలించెదము, దీనికి పశుబలము, కుతంత్రము, మోసము మొదలైన వాటిని మన ముపయోగించెదము; లేదా వారు మననిమిత్తము తమ స్వాతంత్ర్యమును వదలుకొనుట వారికి తమ ముఖ్య కర్తవ్యమని బోధించెదము.

ఒక మనుష్యుడుగాని ఒక సంఘముగాని మనపైని అధిక్యమును బడయుటకు మన మవకాశము నిచ్చినచో ప్రకృతికి బానిసలుగా వారు చేయవలసిన పనులలో యితరుల చేత చేయించుటకు వీలైనవాటి నన్నింటిని మనచేత చేయించెదరు. ఒకడు తన కుటుంబమును మాత్రమే పోషింపవలసియున్నచో ఎట్టి కష్టమును లేకుండ రోజుకు మూడు నాలుగు గంటలు పని చేసిననే చాలును. అతడు పరాధీనుడైనచో రోజుకు పదునైదుగంటలు చాల కష్టపడి పని చేయవలసివచ్చును. ఈరీతిగా ఒకడు మరియొకనిని తనకు బానిసనుగా చేయకుండ కాపాడుటయే ధర్మప్రభుత్వముల కన్నిటికి ప్రధాన కర్తవ్యమై యున్నది కాని యిపుడున్న ప్రభుత్వములలో చాలభాగము దీనికి విరుద్ధముగానే పని చేయుచున్నది వారు మనకు బానిసత్వమును విధించెదరు పైగా దానినే స్వాతంత్ర్యమందురు. వనయజమానుల దురాశను గూడ వారు నిరోధించెదరు కాన ఆరీతిగా మన

[౧౨-వ పేజి చూడుడు]

# గోకర్ణభీమచోళుల వంశవృక్షము

## "పూర్వశాసనముల"నుగూర్చిన కొన్ని సందేశములు

[విద్వాన్ కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు, ఆం. చా. ప. మండలి, ఓరుగల్లు]

పూర్వశాసనము లనుశీర్షికతో గోలకొండ ౧౦వ సంపుటము ౧౪వ సంచిక [౧౧వ అమర్దాదు ౧౩౪౪ఫ.] లో శ్రీయుత కోట్పూరు భరతయ్యగారొక వ్యాసము ప్రకటించిరి. దానిలో వారుకొన్ని శాసనములపట్టికనిచ్చిరి. అందులో గోకర్ణభీమ చోడదేవులకు సంబంధించినవికూడ గలవు కాని వారు తమవ్యాసమున చివరెండు పేరాలలో చెప్పిన విషయములు చాల గంభీర గోళముగా నున్నవి. కర్ణాటచోళులని కోడూరు పురాధీశ్వరులకును, కందూరి రాజులకు చేడచోళులనియు వారు తెలుపుటయేకాక ఒక ఉదయాదిత్యుడు ఉదయాదిత్యాలంకారమను గ్రంథమును, ఒకగోకర్ణుడు [గోకర్ణ]ఛందస్సు రచించినాడనియు, వాగీంద్ర చూడామణి యను జైనాచార్యుని శిష్యుడనియును సూచించిరి. వీరువ్రాసిన విషయములు సప్రమాణముగా తమయొద్దగల శాసనాధారములనుబట్టి నిరూపింపవలసియున్నది. ఎందుకనగా, గోకర్ణ భీమ చోడులు, వారిపూర్వులునుగూడ తెలుగు చోళులలో నొకశాఖవారుకాని కర్ణాటచోళులు కారని నాయూహ. ఏలయన, వీరిశాసనములు, వీరు నివసించిన దేశము తెనుగు దేశమునకు, తెనుగుభాషకు సంబంధించినవిగా నున్నవి. ఆంధ్రుల చరిత్రకారులు వీరిని కర్ణాటచోళు లనిరి. దీని ననుసరించియే కోట్పూరి భరతయ్యగారుకూడ వీరిని కర్ణాటచోళులన్నారో పొరబడినట్లెంచుకొనవలయును. వీరిని మారేమండ రామారావుగారు తెలుగు చోళులనుట సమంజసముగానున్నది. శ్రీభరతయ్యగారి తీర్మానమునకు శాసనాధారమేమైననున్న వారు కర్ణాటచోళులన్నందుకు హేతువులను జూపగలరు. ఇదివరకే శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పినమాటలు.—"గోకర్ణుడు వాగీంద్ర చూడామణి శిష్యుడు" "ఉదయాదిత్యుడు ఉదయాదిత్యాలంకారమును చేసెను" వీనినే పలువురు స్మరించుచున్నారు కాని పై వాక్యముల నిజములను తెల్పగల ఆధారములను ఎవరును చెప్పుటలేదు. చెప్పినంత వరకావిషయములను స్పష్టీకరించుటలేదు. ఇప్పుడు భరతయ్యగారుకూడ సకారణముగా పై వాక్యాంశములను నిరూపింప పాటుపడెదరని విశ్వసించుచున్నాము. ఇంతదూరము ఎందుకు వ్రాయవలసి వచ్చుచున్నదనగా, వీరు చెప్పిన శాసనములకు సరియైనపాఠము లింతవరకెవరును ప్రకటించియుండలేదు. ప్రకటింప కొంత యత్నముజరిగిన తెలంగాణాశాసనములనుబట్టి పైభరతయ్యగారు చెప్పినసంగతు లిదివరకే శిథిలమైనవికాని, మామిళ్లపల్లి సంస్కృతశాసనము నర్థము చేసికొనుటలో శ్రీమారేమండ రామారావుగారును, వీరివ్రాతలుచూచియేకాబోలు ఇప్పుడు భరతయ్యగారును గోకర్ణునకు ఉదయాదిత్యుడు పుట్టినాడు, ఉదయాదిత్యునికి భీమగోకర్ణులు పుట్టిరి అని వ్రాయుచున్నారు. ఇట్లువ్రాయుటలో పై వీరందరు పొరపడుచున్నారేమోయని సంశయము కలుగుచుండుటచే, వీరినిగురించియు, వీరి వంశవృక్షమునుగురించియు కొంత వ్రాయుచున్నాము.

తెలంగాణా శాసనములందలి యీక్రింది శాసనముల సహాయముచే భీమ గోకర్ణుల యొక్కయు, వారి పూర్వులయొక్కయు వంశవృక్షమును, వేయిస్తంభాలగుడి శాసనములో చెప్పినదానిని మరికొంత వివరించి యిచ్చుచున్నాము.

(౧) మామిళ్లపల్లి సంస్కృత శాసనము.
(౨) ,, తెనుగుశాసనము.
(౩) [illegible]కొండపల్లిశాసనము.
(౪) పానుగల్లుశాసనము (దక్షిణపువైపు) (ఇతరశాస. నెం. ౧౭)

ఇవిగాక జడ్చర్లశాసనము వేయిస్తంభాల గుడిశాసనముగూడ సమాలోచనచేసి చూడవగును.

మామిళ్లపల్లిశాసనము(సంస్కృతము)నుబట్టి తీవ్రాంశు కులతిలకుడును, కరికాలకర్ణుడును, గోకర్ణుడనువాడు ఒకడు పుట్టినాడు. అతనికి సత్యసంధతగల ఉదయాదిత్యుడు పుట్టినాడు. ఇతడు చోడుడని ఖ్యాతిచెందినవాడు. ఇతనిధర్మస్థితియు, ధార్మైకత్వము వర్ణింపరానివి. అటుతర్వాత నక్షత్రగుణప్రసూన తేజసులైన భీమగోకర్ణులు సూర్యచంద్రులువలెనే గలిగిరి. [ఎవరికి? గోకర్ణునికేగాని ఉదయాదిత్యునికిగాదు. ఉదయాదిత్యుడనుకొన్నవారిది తప్పని మరియొక శాసనమునుబట్టి నిర్ధారణ చేయగలము]

నిస్సీమప్రేమబంధములుగల భీమగోకర్ణులు తుమ్మటగ్రామ, మడింగంటి గ్రామభాగము లను వరుసగా దానము చేసికొనిరి. ఈమామిళ్లపల్లిశాసనమునుబట్టి వీరి వంశవృక్షము ఇట్లుండును.

గోకర్ణుడు
ఉదయాదిత్యుడు — భీముడు — గోకర్ణుడు

ఈశాసనమునకుజోడించి పానుగల్లుశాసనము [నెం. ౧౭రు సంస్కృతము] చదువుకొనవలెను. పానుగంటిశాసనములోనే మున్నది అంటే వినుడు.

సోమరాజను ఒకరాజు గలడు. అతడు బెడగాంబయనునొక దేవిని పెండ్లాడెను. ఆదంపతులకు శ్రీమన్మేలాంబిక, మేనా హిమవంతులకు పార్వతీదేవి, పుట్టినట్లు పుట్టినది. లక్ష్మి పురుషోత్తమునికి ఖ్యాతిని గలిగించినట్లు ఆమేలాంబిక తనభర్తకు ప్రఖ్యాతి గలిగించినదట. [అభర్త ఎవరో ఆశాసనమునుబట్టి స్పష్టమగుటలేదు.] ఆమె మూడువేదములనువలెనే, త్రేతాగ్నులనువలెనే, ధర్మార్థకామములనువలెనే ఉన్నటువంటి ఉదయాదిత్యుని, భీముని, గోకర్ణుని కనెను. ఉదయాదిత్యు డాదిత్యప్రతిబింబరూపుడే. భీముడు భీమపరాక్రముడు, గోకర్ణుడు భూజనమాననీయ చరితుడు. వీరిలో భీముడు పాండవభీమునిబోలి దోర్విక్రముడై దిశలందు ప్రఖ్యాతమైన కీర్తికలవాడయ్యెను. భీముడో లేక ఈమువ్వురునుకలిసియో తర్క—అబ్ధి—రవిమ్మితే—౧౦—శా.శ. ౧౦౪౯—క్రీ॥ శ॥ ౧౧౨౭వకు సరియగు క్రోధిసంవత్సరమున సూర్యగ్రహణసమయమున చోడ భీమనారాయణ యనుపేర నొక అగ్రహారమును బ్రాహ్మణులకు దానము చేసిరి. [ఇందు మనము గమనింపవలసినవిషయము వంశవృక్షమే] కనుక ఈశాసనమునుబట్టి వీరి వంశవృక్షమిట్లుండును.

సోమరాజు—భార్య—బెడగాంబ
మేలాంబిక—భర్త?
ఉదయాదిత్యుడు — భీముడు — గోకర్ణుడు

అని తెలుచున్నది.

పూర్వముదహరింపబడిన వంశవృక్షమును దీనికి సంబంధించినచో నీక్రిందివంశ వృక్షము తేలును.

కాశ్యపగోత్రుడు గోకర్ణుడు (కరికాలకర్ణుడు సూర్యవంశమువ,)
(మేలాంబిక) సోమరాజ బెడగాంబల పుత్రిక.
ఉదయాదిత్యుడు — భీముడు — గోకర్ణుడు

ఉదయాదిత్యుడు (కొల్లిపాక శాసన మితనిదే అయితే) శా. సం. ౧౦౪౭. క్రీ॥శ॥౧౧౨౫ కాలపువాడు.

| | |
|---|---|
| భీముడు<br>గోకర్ణుడు | మామిళ్లపల్లి శాసనమును బట్టి విరోధి సంవత్సరమును బట్టి శా. శ. ౧౦౪౧-క్రీ. శ. ౧౧౧౯-౨౦ కాలపువారనియూహింపవచ్చు. |

కావున ఇందు చెప్పినిన భీమ గోకర్ణులు వేయిస్తంభాల గుడిలో చెప్పబడిన రుద్రదేవుని సమకాలపువారు కారని పాఠకులు ఎఱుంగవలయును.

పై విషయములకు దోడుగా మామిళ్లపల్లి తెనుగు శాసనమందు చెప్పబడిన కందూరి గోకర్ణ దేవచోడుడు మేలాంబికా కనిష్ఠ పుత్రుడు అయియుండునా? కాజాలడని నా యూహ. ఏలయన రాజ్యము ఉదయాదిత్యునిది. అతని సంతానములో యువరాజుగాని అతని సవతిసోదరుడుగాని రాజ్యమేలుచునున్నగాని ఆరాజుపేర అతని సేవకులు శాసనము వేయ తలపడరు. వేయిస్తంభాల గు. లో కందూరోదయచోడ చక్రవర్తియని పిలువబడినవాడు పై వంశవృక్షములో చెప్పబడిన ఉదయాదిత్యుడై యుండవలయును. ఇతని రాజధాని కందూరు అనుటకు సందియముండదు. ఇతని తండ్రియగు గోకర్ణుడు మేలాంబికా భర్తయు, మామిళ్లపల్లి సంస్కృత శాసనమున చెప్పబడినవాడును నగు ప్రథమ గోకర్ణుడని చెప్ప, ఇతని రాజధాని కోడూరనవచ్చును. ఏలయన, జడ్చర్లశాసనము (౧౦౫౫ A. D.)లో కోడూరి గోకర్ణ సంగరు కలిచ్చిరి అనుమాటలు గానవచ్చుచున్నవి. కాని కోట్పూరి భరతయ్యగారు ప్రథమ గోకర్ణునికి ఉదయాదిత్యుడను సోదరుడున్నట్లు చెప్పుటకుగల యాధారమేమో తెలుపవలసి యున్నది. ఇప్పుడు వేయిస్తంభాలగుడి శాసనము[అనుమకొండ క్రీ. శ. ౧౧౬౨-౩]లోని విషయములతో సమన్వయించిన పక్షమున వీరి వంశవృక్షము మరింత ముందునకు నడచును.

భీమునిచే కూరమానియగు గోకర్ణుడు చంపబడెను. (మహాంధకారములో పిల్లి పిల్లచే ఇంటి యెలుక చంపబడినట్లు) రుద్రుని పరాక్రమమునకు వెరచి చోడోదయరాజు ప్రాణములు విడిచెను రుద్రుని భయముచే తెలప్పదేవుడు చనిపోగా అతని రాజ్యమును భీముడు అపహరించి కొంతకాల మనుభవించెను. (మా. వే. గు.శా. పుట ౯౦,౯౧) భీముడు నరపశువు. మాతృసపత్నీపశు. సోదరుని జంపినవాడు. రుద్రదేవునితో పోటీకి వచ్చుచుండెను. [మా. ౯౨ పుట వే. గు. శా] భీముని రాజ్య వైభవమును గూర్చియు, అతని దుశ్చేష్టితమును గూర్చియు విని రుద్రదేవుడు సేనముగైకొని దండయాత్రకు (భీమునిపై) బయలుదేరెను [మా. ౯౩ పుట వే.గు. శా] రుద్రదేవుడట్లు కొన్ని యడుగులు పోయి వర్ధమాన నగరమును మొదట కాల్చివేసెను. రుద్రదేవుని వలని భయముతో భీముడు సోదరులతోను, తల్లితోను పెండ్లాముతోను అడవికి పారిపోయెను. వానివెంట పోవుచు రుద్రదేవుడు చోడోదయుని నగరమును దహించెను. ఆచోడోదయుని పట్టణముయొక్క దుర్గము త్రవ్వి పారవేసి ఆ పట్టణ మధ్యమునందొక గొప్పచెఱువు త్రవ్వించెను. కందూరోదయ చోడ చక్రవర్తి వంశమందు పుట్టిన పద్మను (పద్మావతీ ఆశ్రయుడయ్యెను) పెండ్లాడెను. పై యంశములను బట్టి ఉదయాదిత్యునికి (కందూరోదయ చోడునికి) ఇద్దరు భార్యలనియు, మొదటి భార్యకొడుకు గోకర్ణుడు (రెండవగోకర్ణుడు) కందూరునకేయువ రాజుగాను, రెండవభార్య కొడుకగు భీముడు (వర్ధమాన పురమునకు రాజుగానున్న) యిద్దరు కొడుకులుండి యుండవలెనని మనమూహింపవలసియున్నది. ఏలయన ప్రథమ గోకర్ణుని కొడుకులు నిస్సీమ ప్రేమబంధము గలవారు కావునవారిలో నీవిధస్పర్థ ఉండియుండదు. రుద్రదేవుని భయమునకోర్చజాలని కందూరి ఉదయనచోడుడు కందూరునందు పెద్దకొడుకగు గోకర్ణునితోనుండ, వర్ధమానపురమునుండి భీముడు కందూరమునకువచ్చి గోకర్ణుని చంపినందులకు రుద్రదేవుడు వీరిదేశముపై దండెత్తిరాగ, ఉదయచోడుడు చచ్చెను. రుద్రదేవుడు భీమునిపట్టణము వర్ధమాన పురముకాల్చెను. తరువాత చోడోదయుని పట్టణము అనగా కందూరోదయ చోడుని పట్టణమైన కందూరమును ధ్వంసము చేసెను. అతనివంశములో పుట్టిన అనగా అతనిబిడ్డను అనగా గోకర్ణదేవచోడుని చెల్లెలినిగాబోలు రుద్రదేవుడు పెండ్లియాడియుండవచ్చును గాన ఆ వంశవృక్షము ఇట్లుండగును.

I

గోకర్ణ—(మేలాంబిక)
(కోడూరుపురవరాధీశ్వరుడు)
ఉదయాదిత్యుడు — భీముడు — గోకర్ణుడు
(కందూరు రాజధానిగా)

| మొదటిభార్యవలన | రెండవభార్యవలన |
|---|---|
| గోకర్ణ II (కందూరు రాజధానిగా) | భీముడు (వర్ధమాన పుర రాజధానిగా) |

జడ్చర్ల శాసనప్రకారము కందూరిఉదయనచోడమహారాజులు రుద్రదేవుని వేయిస్తంభాలగుడి శాసనకాలమునాటికి బ్రతికియున్నారు కావున, అతడు కందూరోదయచోడ చక్రవర్తియనియు, చోడోదయుడనియు పిలువబడినవాడే అయినట్లయిన నతడు రుద్రదేవుని భయమునను చావలేదని అనవలెను. దీనిని సమర్థించుటకో ఖండించుటకో కోట్పూరిభరతయ్యగారి శాసనములక్కరకు రావలయును కావునవారు తమశాసనములను ప్రకటించుటయో మాకొకసారి యొసగిచ్చుటయో చేయగలిగినయెడల ఈవంశవృక్షముయొక్క చిక్కు త్వరలో వదలిపోగలదు. లేనిచో కొంతకాలము పట్టును. శ్రీకోట్పూరి భరతయ్యగారు తమ చిరునామా మాకుదెలిపినచో మా వేయిస్తంభాలగుడి శాసనగ్రంథప్రతి నొకదానిని వారి కుచితముగా నీయగలవారము.

ఆంధ్రులకు
౨౦ లక్షల నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధికి ముఖ్యసాధనము? గోలకొండ పత్రికా పోషణము

# గోలకొండపత్రిక

వర్తకులకు
నిజామురాష్ట్రములోని జిల్లాలలోని ఆంధ్రులలో మీ వర్తకాభివృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము

సంపుటము 10 | ఆగస్టు 22 వ తేది 1935 సం॥ గురువారము | సంచిక 30

## సంపూర్ణ స్వాతంత్ర్యము కలవారేమి చేయగోరెదరు?

మొదటిపుట తరువాయి ☞

బానిసత్వమునకు కట్టుబాటు నేర్పరచెదరు

నీగ్రోలను బానిసలుగా నుంచుకొని, వారిచేత పని చేయించి, వారిని పోషించుటకగు వ్యయముకంటె జీతములిచ్చి పని చేయించుటవలననే తక్కువ వ్యయమగు నెడల నిట్టి బానిసత్వమునే మనము స్వార్థపరత్వము వలన స్వలాభముకొరకే తొలగించెదము గాని, మేము నీగ్రోలకు స్వాతంత్ర్యము నిచ్చితిమని ప్రగల్భోక్తులను పలికెదము.

మనుష్యుడు ప్రకృతికి బానిసగా నుండుటలోను మరియొక మనుష్యునకు బానిసగా నుండుటలోను చాల భేదమున్నది. అది సహజమైనది. ప్రకృతి తన బానిసలను చాల దయతో చూచును. మనము తినునట్లును, త్రాగునట్లును ఆకలి దప్పులు కల్పించినపుడు, తినుబండారములను, త్రాగు వస్తువులను మనకు చాల ఆనందము కలుగునట్లు గూడ చేయును. గాన మనము మేలుగా నున్నప్పుడు అన్నము మితిమీరి తినుచును త్రాగుచు నుందుము. మనము నిద్రపోవలెను. లేనిచో మనకు పిచ్చి యెత్తును. నిద్రవలన మనకు చాల సౌఖ్యము కలుగును. గాన మనము నుదయమున నిద్ర లేచుట మనకు చాల కష్టముగానే యుండును. పడుచువారికి గృహములు కుటుంబములును చాల సౌఖ్యముగా నుండును గాన, వారు వివాహములు చేసుకొని తమ స్వప్నములను సిద్ధింపజేసికొనుటకై గృహనిర్మాణసంఘములలో చేరెదరు.

మన సహజవాంఛలు బానిసత్వమేయైనను మనము వాటిని నిరసింపకపోవుటయే గాక, వాటిని నెరవేర్చుటవలన అధికమైన ఆనందమును గూడ పడయుచున్నాము. వాటిని పొగడుచు మనము శ్లోకప్రధానములగు పాటలను వ్రాసి పాడుచుందుము. "గృహము ప్రియమైన గృహము" అను పాటను పాడుటవలననే ఒక దేశ[illegible] ప్రజలవలన తనకు కావలసిన ఆహారమును అధికముగా సంపాదించుకొనగలుగును.

ఒక మనుష్యుడు మరియొక మనుష్యునకు బానిసగా నుండుటవలన, బానిసగా నున్న వారికి దారుణమైన దుఃఖము కలుగునే కాని లేశమైనను ఆనందము కలుగదు. దాని శరీరము నాత్మయును గూడ ద్వేషించుచునే యుండును. దీనిని కవులు వర్ణించరు. ఒకడు మరియొకనికి యజమానిగా నుండగూడదనియే వారు ప్రకటించెదరు.

యూరపుల గొప్పప్రవక్తలలో కడపటివాడగు [illegible] అనునతడు, బానిసత్వమును తీవ్రముగా నిరసించుచు, ఒక మనుష్యుడు మరియొక మనుష్యుని బానిసగా నుంచుకొనగూడదని చట్టము చేసినంతగా బానిసత్వము అపివేయక పోయినను నొకడు తనకు బానిసగా నున్న మరియొక మనుష్యునిపట్ల స్వార్థపరత్వమువలన చూపునట్టి క్రూరత్వమునకు మితియేయుండదు అని ధృవపరచుటకు యావజ్జీవము ప్రయత్నించుచునే యుండెను. బానిసలకును వివాహములు జరుగుచునే యుండును బానిసలు [illegible] యజమానులు యజమానుల [illegible] నేర్పరచెదరు.

ప్రతి మనుష్యుడును తనపనిని స్వయముగా చేసికొనవలెనే గాని యితరులచేత చేయించగూడదను [illegible] యీ బానిసత్వమును పూర్తిగా నిర్మూలించుటకును కార్మికులకును యజమానులకును వివాదములు జరుగుచునే యుండును. [illegible] గాని [illegible] సంఘములలో నేర్పడవు అని [illegible] చెప్పెను.

బానిసలముగానున్న మనము బానిసలముగా మన్నామను విషయమును తెలుసుకొనకుండ చేయుటకు యజమానుల తెగవారు, వారి పార్లమెంటులు, పాఠశాలలు, వార్తాపత్రికలు వాటిమూలమున మిక్కిలి గట్టి ప్రచారమును సలుపుచుందురు. "మన దేశము స్వతంత్రదేశము. మన దేశమునకు స్వాతంత్ర్యమును సమకూర్చుటకు మన పూర్వులు జానురాజుచేత మాగ్నాకార్టాలో సంతకము చేయించిరి. స్పెయినుదేశపు నౌకాదళమును ఓడించిరి. మొదటి చార్లెసురాజు తలను నరికివేసిరి. హక్కుల బిల్లును అంగీకరించునట్లు విలియంరాజును నిర్బంధించిరి. అమెరికా దేశ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఈటనులో వాటర్లూ, ట్రఫాల్గరు యుద్ధములలో జయించిరి. ఇటీవల తలవని తలంపుగా జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, టర్కీ దేశములలో ప్రజాప్రభుత్వముల నేర్పరచిరి." అని మనకు చిన్నప్పటినుండియు బోధించుచు నేర్పుచునే యున్నారు.

మీకు వోటింగు అధికారమున్నది. దానిని మీరు సరిగా నుపయోగించకపోవుటవలననే మీకీ కష్టములు కలుగుచున్నవి. గాన దీనికి మీరే బాధ్యులు. ఫ్యాక్టరీ చట్టములు, జీవనరక్షణములు, ఉచితవిద్య, ఉచితాహారమును నన్నియును మీ కొరకేర్పరుపబడెను. ఉచితజ్ఞుడైనవాడు ఇంతకంటె కోరదగినదేమున్నది! ధనికుల ఆదాయములో పన్నులక్రింద నాల్గవవంతు, మూడవవంతు సగభాగము గూడ వసూలు చేయుచున్నారని వారందురు. గాని బీదలకు [illegible] యిండ్లు బాడుగలక్రింద వారి వేతనములో వంతుకూలిలో సగమువంతు వ్యయపరచుటలేదా! మనము స్వతంత్రులముగా నున్నచో ప్రతిదినము పనిచేయవలసినదానికంటె రెండురెట్లు హెచ్చు కాలము మనమిప్పుడు పనిచేయుటలేదా? దీనిని గూర్చి ధనికులేమైన వ్రాసెదరా!

౧౮వ శతాబ్దమున వాల్టెయిరు, రూసో, లూంబెయిను అనువారును. 19వ శతాబ్దమున కాబెటు, షెల్లీ, కార్లు మార్క్సు, లాసెల్లీ అనువారును, 20వ శతాబ్దమున లెనిను, ట్రాట్స్కీ అనువారును యీ బానిసత్వమును నిరసించినందులకు, వారిని నాస్తికులు, వ్యభిచారులు, దుర్మతులు, దోపిడిగాండ్రు అని ధనికులు కసిదీర తిట్టుచుందురు. వారు వ్రాసిన గ్రంథములను కొనినవారికిని, అమ్మినవారికిని శిక్ష విధించుచుందురు.

వారిశిష్యులు విప్లవమును కలిగించినచో యింగ్లాండు దేశమువారు వెంటనే వారిపైని ధ్వజమెత్తెదరు. విప్లవకారులు మరల బానిసత్వపద్ధతిని నెలకొల్పునట్లు వారిని నిర్బంధించుటలో తమకు సహాయము చేయునిమిత్తము యితర దొరతనములకుగూడ ధనమునిచ్చెదరు. వాటర్లూలో ధనికులపక్షమునకు విజయము కలుగుటచే అది బ్రిటిషుస్వాతంత్ర్యమునకు మరియొక విజయమని ప్రకటించిరి. ఈ యుద్ధమున బీదలపక్షమునకు పరాజయము కలిగినందుకు బైరను ప్రభువు చింతించినట్లుగా బ్రిటనుదేశమునందలి కార్మికులందరును గూడ చింతింపవలసియుండగా, వారట్లు చేయక యిది నిజముగా బ్రిటిషు స్వాతంత్ర్యమునకు విజయమే యని నమ్మి, అధికోత్సాహముతో విజయధ్వనుల నొనరింపసాగిరి.

1922 లో రష్యాలో విప్లవపక్షమువారికి విజయము కలిగినది. అంతటితో పోరాటమాగిపోయినది. కాని రష్యాసోవియటురాజ్యాంగము మొదటిసారిగ [illegible] రాజ్యముగా నేర్పడుచుండ మన రష్యావిప్లవపక్షమువారిని తిట్టుచునే యుండిరి. వారిపైని నిందలను మోపుచు, అసత్యవార్తలను ప్రకటించుచునే యుండిరి. విప్లవపక్షనాయకులు ప్రపంచమునందు మిక్కిలి భయంకరులైన ద్రోహులనియు, నిరంకుశులనియు మనరాజనీతిజ్ఞులు అనేక సంవత్సరములనుండి వారిని కసిదీర తిట్టుచునే యుండినను, యిప్పుడు వారినే మీరు విందుభోజనమునకు పిలువవలసి వచ్చినది. ఇది మంచిపనియే.

బానిసలుగానున్న తరగతివారిని మోసపుచ్చుటకే యీ కపటనాటకమంతయును యేర్పాటు చేయబడెను గాని యజమానులతరగతియే యీ మోసమునందు పూర్తిగా తగుల్కొనును. ధనవంతులబిడ్డలు మొదట ప్రారంభపాఠశాలలలోను తరువాత ఉన్నతపాఠశాలలలోను, పిమ్మట విశ్వవిద్యాలయములలోను చదివెదరు గాన వీటిలో నేర్పబడుచున్నట్టియు, అసత్యములతో నిండియున్నట్టియు చరిత్రలు, రాజకీయశాస్త్రములు మున్నగువాటి నన్నిటిని వీరే యెక్కువగా వశగతము చేసుకొందురు, గాని కార్మికుల బిడ్డలకట్టి అవకాశము లేనియుండెను. "మీరు గొప్పవారిబిడ్డలు. ఇతరులకంటె మీరు చాల గొప్పవారు. బీదవారు మీ బూట్లను శుభ్రపరచెదరు. మీ సామానులను మోసెదరు. వారు కష్టపడి పనిచేసి మీకు అధికమగు నాదాయము వచ్చునట్లు చేసెదరు" అని గూడ ధనికుల బిడ్డలకు నేర్పెదరు. వారు వీటినన్నిటిని పూర్తిగా నమ్మెదరు. "ఇపుడున్న ప్రభుత్వపద్ధతివలననే తమకిట్టి ఉన్నతస్థితి లభించినది. తమ ప్రజ్ఞకు తగిన గౌరవమునే కోరెదరు గాన నిది చాల శ్రేష్ఠమైన పద్ధతియే యగును. గాన దీనిని కాపాడుటకు ప్రాణముల నర్పింపవలసివచ్చినను గూడ వెనుదీయగూడదు" అని ధనికుల బిడ్డలు మొదటినుండియును గూడ నిశ్చితాభిప్రాయులగుదురు. మనదేశమున మన్న ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు నివసించుటకు తగిన యిండ్లు లేవు. వారికూలి వారిపొట్టకును బట్టకును సరిపోవుటలేదు. ధనికులు వారిని నీచముగా చూచెదరు. వారికి దినభత్తెము నిచ్చెదరు. వారు వీరిని బహిష్కరించెదరు గాన బీదవారికి యీ పద్ధతిపైనెట్టి గౌరవభావమును కలుగజాలదు. పరిస్థితులు కేవలము విరుద్ధముగా నుండగా వారెట్లు నమ్మగలుగుదురు! ప్రస్తుతము ఆర్థికదుస్థితి మరింత అధ్వాన్నముగా నుండుటచే బీదవారు కట్టుబాటునంతను పూర్తిగా ధ్వంసమొనరించునట్టి స్థితిగూడ నపుడపుడు కలుగుచుండును. అట్టి స్థితిలో వీరు బారిదోపిడీ దొంగలుగా నేర్పడకుండ వీరిని కూడగట్టుకొనినచో వీరి సహాయముతో నొక సామ్రాజ్యము నేర్పరుచుటకు తగిన ధైర్యసాహసములును, ధీశక్తియును, బాహుబలమును ఉత్సాహమును గల నెపోలియనువంటి మహాసేనాని యొకడు బయలుదేరవలెను. చక్రవర్తికి జయ అని మమ్మారు నోరు పగులునట్లరచుచుండును ఈ బానిసలు వారి స్వాతంత్ర్యమును గురించి బ్రిటనులోగాని అమెరికాలోగాని వోటింగు పత్రముపైని క్రాసు గుర్తునుగూడ పెట్టెదరు.

ఇంతవరకును నేను స్పష్టములును, సహజములును, చరిత్రాత్మకములునగు విషయములను మాత్రమే తెలిపితిని. వీటినిట్టి నేను అభిప్రాయములను వెల్లడించినచో వాదప్రతివాదములకవకాశమేర్పడును. [illegible] జవాబు చెప్పదగిన స్థితిలో లేనప్పుడు నేనీవాదమునకు సిద్ధపడగూడదు. రేడియోలో మాటలాడుటలో నిట్టి వివాదాస్పదములైన విషయములను గూర్చి నేనెన్నడును మాటలాడను. మీరే వీటినిట్టి అభిప్రాయములను నిర్ణయించుకొనవలెనని గూడ నేనను. నేనటులనినచో మీలో ధీమంతులుగానివారికి చాల విపరీతములైన అభిప్రాయములు గూడ కలుగవచ్చును. నీవు బానిసవని పిలువబడుట కెవ్వడును గూడ నంగీకరింపడు. కాని అందువలన బానిసత్వము చెడ్డపద్ధతియని నిర్ణయించ వీలులేదు.

"ప్రజలు అధికారుల అజ్ఞలను విధేయతతో నెరవేర్పకున్నచో యేప్రభుత్వమును సాగదు. ఏదేశమునను శాంతిక్రమము నేర్పడదు. ప్రజలు అధికారుల అజ్ఞలను సరిగా నెరవేర్చుటకు అధికారులకు కొంత ప్రత్యేకత యుండవలెను. అందులకు వారికి ఉద్యోగలాంఛనములగు అందమైన దుస్తులు, పతకములు, గౌనులు, యూనిఫారములు, మాటలాడుటలో కొంత దర్జాయునివన్నియును వుండవలెను. వారు యెచ్చటికైన వెళ్లవలసివచ్చినప్పుడు ఫస్టుక్లాసు రైలుబండ్లలోను చాల ఖరీదుగల మోటారుకారులలోను అతిశ్రేష్ఠములైన గుఱ్ఱముల మీదను యెక్కి వెళ్లవలెనే గాని కాలినడకను వెళ్లగూడదు. వారి బట్టలను జోళ్లను శుభ్రపరచుట మున్నగు పనులను చేయుటకు నౌకరులుండవలెను. వీరెవరును వారు స్వయముగా నే పనిచేయగూడదు. అధికారి గంటకొట్టిన నిమిషమున నౌకరు హాజరయి అతని యాజ్ఞలను నిమిషములోపల నెరవేర్చుచుండవలెను." అని అరిస్టోటలు మొదలైన విఖ్యాతపురుషులే చెప్పియున్నారు. ఇవన్నియును నెరవేరవలెననిన యీ అధికారులు చాల ధనవంతులుగా నుండవలెను. వారిని చూడగానే వారు దైవాంశసంభూతులను భావము సామాన్యప్రజలలో కలుగవలెను. సామాన్యప్రజలను అజ్ఞానులైన విగ్రహారాధకుల స్థితిలో నుండునట్లు అధికారులు చేయవలెను. లేనిచో వారు అధికారుల అజ్ఞలను విధేయతతో నెరవేర్పరు. శాసనములకు బద్ధులై యుండరు అని గూడ కొందరనిరి. ఇంగ్లాండులోని వోటరులలో ౧౦౦ కి ౯౦ మంది కార్మికులేగాని కార్మికులకు వోటుచేయుటకు వారిలో చాలమంది అంగీకరించరు. తొలిసారి స్త్రీలకు వోటింగు అధికారము లిచ్చినప్పుడు యీ హక్కును బడయుటకొరకు అనేక సంవత్సరములపాటు మిక్కిలి కష్టపడి పనిచేసిన స్త్రీలకెవ్వరికిని వారు వోట్లు నియ్యలేదు. అసమానసౌందర్యవతియును మిక్కిలి ధనవంతురాలును [illegible] బడసినదియునగు నొక్క ధనికురాలిని మాత్రమే స్త్రీలు యెన్నుకొనిరి.

ఇది మానవస్వభావము, దీని నెవరును మార్చలేరు అని కొందరందురు. అతిబాల్యదశలోనే ప్రయత్నించినచో మానవస్వభావమును మార్చుట మిక్కిలి సులభము. బానిసజాతుల విగ్రహారాధనపరత్వమును, యజమానుల అహంభావమును గూడ విద్యవలననే కలిగినవి. ఇవిరెండును గూడ కృత్రిమ నిర్మాణములే. శిశువులు ఉయ్యాలలలో నున్నప్పటి నుండియును గూడ అట్టి ప్రచారము జరుగుచున్నది. ఈ విద్యావిధానమును ప్రచారమును మార్చివేసి సరియైనవాటి నేర్పరచినచో విగ్రహారాధనపరత్వమును అహంభావమును గూడ తొలగును అని మరికొందరందురు.

[illegible]

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy.